## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014494

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఉత్తమ స్నేహితులు

గ్రంథకర్త
జొన్నలగడ్డ వెంకటరాధాకృష్ణయ్య
రాజమంద్రి.



టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్సు,
మదరాసు.

[కాపిరైటు రిజిస్టరుడు]

[వెల 4 అణాలు.

# రాజా రామమోహనరాయలు

1600 వ సంవత్సరమున హిందూదేశముతో వర్తకము చేయుట కాంగ్లేయు లరుదెంచిరి. నూటయేఁబది సంవత్సరములు వారు నిరాఘాటముగ వాణిజ్యము సలిపిరి. 1770-వ సంవత్సరమున హిందూదేశ మల్లకల్లోలస్థియందుండెను. దేశమును బరిపాలించుచున్న జహాంగీరుస్థితి కడువిషమముగ నుండెను. దేశమును దమవశముచేసికొనుతలంపున నొక వైపునుండి మహారాష్ట్రులును, మఱొకవంక శిఖులును చెలరేఁగుచుండిరి. ఇంతియేగాక దేశములోని చిన్నచిన్న రాజు లొకరిరాజ్య మొకరాక్రమించుకొనునుద్దేశముతో కలహించుచుండిరి. సమయము కనిపెట్టి విదేశీయులు చాలమంది హిందూదేశము నాక్రమించుకొనుటకే తెంచిరి. అట్లు వచ్చి హిందూదేశవాసులను మంచితనముచే వశపరచుకొని, దేశములోని యల్లరుల నణచి దేశపరిపాలనభారమునుగూడ వహించిన దింగ్లీషువారు. ఆంగ్లేయులు హిందూదేశపరిపాలన భారమువహించుటలో వారికిఁదోడ్పడినవారిలో రాజా రామ మోహనరాయ లొకఁడు.

రాజారామ మోహనరాయలు 1774-వ సంవత్సరమున వంగదేశమున నొక కులీనబ్రాహ్మణకుటుంబమున

జన్మించెను. ఆతనిజనకుఁ డప్పుడు బర్ద్వానుమహారాజునా స్థానమున నుద్యోగిగ నుండెను. తనవలెనే తనకుమారుఁడు కూడ రాజాస్థానమున నుద్యోగిగ నుండవలెనని రామ మోహనరాయలతండ్రి యభిలషించెను. ఈయుద్దేశముతో నాతఁడు తనపుత్రుని వంగభాషాభ్యాసము ముగిసినంతనే ఆస్థానభాషయగు పారసీకభాషయును, సంస్కృతమును, అరబ్బీభాషయు నేర్చుకొనుటకై పాట్నాకుఁ బంపెను. రామ మోహనరాయలు పదునేడుసంవత్సరముల ప్రాయముగల వాఁడగునప్పటికి నాలుగుభాషలు నేర్చియుండెను. ఆతఁడా యా భాషలందలి మతగ్రంథముల నన్నిఁటినిఁ జదివి, గ్రంథస్థ సూత్రములకును, వాని యాచరణమునకును ననంత వ్యత్యాస మున్నదని గ్రహించెను. ఆతఁడు తన మతమునుగూడ విశ్వ సింపఁడాయెను. హిందువులు మతోద్దేశములు సరిగ గ్రహింప కుండ ననేకదుష్కృత్యము లాచరించుచున్నారని యతఁ డొక విమర్శనమును వ్రాసెను. రామమోహనరాయల తండ్రి, ఆ విమర్శనముఁ దిలకించి క్రోధముఁజెందెను. మత విషయమున నిరువురియభిప్రాయములును భేదించినందున నతఁడు తనపుత్రుని గృహమునుండి వెడలి పొమ్మనెను.

తండ్రియాజ్ఞకు మాఱుపలుకక రామమోహన రాయలు వేయిమైళ్లదూరముననున్న టిబేటుదేశమునకుఁ బౌద్ధచారియై యరిగెను. లామాను పూజించునాదేశీయుల

యాచారవ్యవహారములు రామమోహనరాయుల కానంద దాయకముగ నుండలేదు. రెండుసంవత్సరములు గడచిన పిదప నాతఁడు తిరిగి వంగదేశమునకుఁ బోయెను. రామమోహనరాయలు తండ్రిచే క్షమింపఁబడెను. మతాచారముల విషయమున నిరువురియభిప్రాయములు నేకీభవించలేదు. అయినను రామ మోహనరాయలు సద్గుణభూయిష్ఠుఁడగుటచే తండ్రితో వాదములసలిపి అతనిహృదయమునకు నొప్పినిఁ గలిగింపఁజాలఁడయ్యెను. అతనిజనకుఁడు 1804-వ సంవత్సరమునఁ బరలోకమున కరిగినంతనె రామమోహనరాయలు హిందూమతమును దురాచారభూయిష్ఠమొనరించిన బ్రాహ్మణులపై విజృంభించెను.

రామ మోహనరాయలు ఈస్టిండియా కంపెనివారి క్రింద నొకజిల్లాకుఁ గలక్టరుగ నియమింపఁబడియెను. ఆయుద్యోగమును జయప్రదముగ నిర్వహించుట కాంగ్లభాష యావశ్యకమయ్యెను. అతఁ డింగ్లీషుభాష నభ్యసించు నుద్దేశముతో శ్రద్ధగా 'నద్దానినిఁ బఠింపసాగెను. కొలఁదికాలములోనే యతఁడాప్రయత్నమునఁ గృతకృత్యుఁడయ్యెను. 1813-వ సంవత్సరమున రామమోహనరాయ లాయుద్యోగమునకు రాజీనామానిచ్చి తనజీవితమును ప్రజాసేవకు వినియోగింప నిశ్చయించుకొనెను.

రామ మోహనరాయలు హిందూమతముయొక్క సూత్రములకును, ఆ చరణమునందున్న దురభ్యాసములకును గలభేదమును గమనించి తద్విషయము ననేకవిధముల విమర్శించెనని యీవఱలోఁ జెప్పియుంటిమి. మతసూత్రముల తత్వము నర్థముచేసికొనఁజాలక యనేకదురాచారముల నొనరించుచుండుట గమనించి, ప్రజలను సత్పథానువర్తులుగఁ జేయుతలంపుతో హిందూమతరహస్యగర్భితములైన వేదములను, ఉపనిషత్తులను తన మాతృభాషలోని కాతఁడనువదించెను. వేదసూత్రముల ననుసరించి భగవదారాధన చేయుట కొకసమాజమును దా నెలకొల్పెను. ఆసమాజము బ్రహ్మసమాజమనుపేరున నిప్పటికిని సుప్రసిద్ధమై వెలయుచున్నది.

ఈ రెండుపనులఁ జేయుటవలన నాతఁడెల్లరకున నిష్ఠుఁడయ్యెను. పరమపవిత్రములైన వేదములను, ఉపనిషత్తులను మాతృభాషలోనికిఁ బరివర్తన మొనరించుటయును, శతాబ్దములనుండి యాచరింపఁబడుచున్న మతాచారముల విసర్జించి, నూతన మతాచారముల ప్రచార మొనరించుటయును శాపహేతువులని హిందూమతానురక్తు లెల్లరును వాదించి, కులమునుండి బహిష్కరింతుమని రామమోహనరాయలను బెదరించిరి. ఎందఱెన్నివిధముల భయపెట్టినను అతఁడు జంకలేదు.

ఆంగ్లభాషాభిమానియగు రామమోహనరాయలా భాషాప్రచారమునకు మిక్కిలి పాటుపడెను. కలకత్తా నగరమున అలగ్జాండరు డఫ్ అనుస్కాట్లండు దేశీయుఁ డింగ్లీషు పాఠశాలను స్థాపించు సందర్భమున నితఁడు విశేషముగ సాహాయ్యమొనరించుటయేగాక ఆ పట్టణమున మఱొక భాగమున హిందూపాఠశాలయనుపేరున తానొక పాఠశాలను నెలకొల్పెను. ఆ పాఠశాల తదనంతరము కళాశాలగా మాఱి యిప్పటికిని అపారప్రఖ్యాతితో విలసిల్లుచున్నది.

ఈ మహాపురుషుఁ డొనరించిన సత్కార్యములలో ముఖ్యమైన దొకటి సహగమననాశము. దానిని 'సతి' యనియు, 'సహగమన' మనియునందురు. పూర్వమొక స్త్రీ యొక్క భర్త చనిపోయినచో నామె మరణించిన తనభర్తతోఁగూడ దహనము చేయఁబడుచుండునలవాటు సర్వసాధారణమై, సర్వవ్యాప్తమైయుండెను. దీనినే సహగమన మనెడివారు. అట్లు చనిపోయినభర్తతోఁ బాటి తానుగూడ బలాత్కారముగ ప్రాణత్యాగ మొనరించినకాంత పతివ్రతగ నెన్నఁబడుచుండెను. రామమోహనరాయలాతని ముప్పదియేడవ సంవత్సరమున తనసహోదరుఁడు పరలోకగతుఁడైన పుడతనివదినెకూడ దహనముచేయఁబడుట కనులారచూచి భయవిహ్వలుఁడయ్యెను. బ్రతికియుండగనే చంపివేయుట యెంత యన్యాయము? ఆమెనగ్నిజ్వాలలు చుట్టుముట్టిన

సమయమున నెల్లరిహృదయములును ద్రవీభూతములగు నట్లు రోదన మొనరించుచు నాయనలజ్వాలలనుండి తప్పించు కొనఁ బ్రయత్నించునపుడు పురోహితుడును, తదితరబంధు జనులును కఱ్ఱలతో నామెను రాకుండ పొడుచుచు మరణింపఁ జేసిరి. రామమోహనరాయల హృదయమున విషాద మేఘము లావరించుకొనెను. ఆ దినమునుండి, సహగమన మహాచారమును సమూలముగ నంతరింపఁజేయుటకు ఘోర శపథ మొనరించి వేదములలో నట్టి దురాచార మెచ్చటను వ్రాయఁబడలేదని సప్రమాణముగ, బహిరంగముగ నెన్నో యుపన్యాసములనిచ్చి హిందూమతాచారాభిమానుల యభి ప్రాయములను ఖండించుటయేగాక యనేకవిమర్శనములు ముద్రింపించి యుచితముగ నెల్లరకుఁ బంచిపెట్టించెను. పది సంవత్సరములాతఁడట్లు పాటుపడగా విలియంబెంటింకు ప్రభువు అను గవర్నరుజనరలు రామమోహనరాయలప్రయత్న ములను బ్రశంసించి సహగమన దురాచారము నణచివేసెను. బెంటింకుప్రభు వాదురాచారము ననుసరించినవారును, ప్రోత్సహించినవారును కఠిన శిక్షకు లోనగుదురని శాసించెను. నాఁటినుండియు మహాభయంకరమగు నా దురాచార మెల్లరు నాచరించుట మానిరి.

పూర్వాచారపరాయణులగుహిందువు లియ్యది తమకు గొప్పపరాభవముగ నెంచి తమయాచారవ్యవహారాదుల

యందు ప్రభుత్వమువారు జోక్యము కలుగఁజేసికొనుట తప్పనియు, నా యాచారము తమశాస్త్రములందు నిషేధింపఁబడలేదనియు మఱల నది యాచరింపఁబడున ట్లొక శాసనము తీర్మానింపఁవలసినదనియు నర్జీ పెట్టిరి. ఈరహస్యము నెఱింగి రామమోహనరాయలు 1830-వ సంవత్సరమున నింగ్లాండునకుఁబోయి పార్లమెంటుసభ్యుల కా దురాచార ప్రధానతత్వము నెఱుంగఁజేయ వారాతీర్మానమును త్రోసి పుచ్చిరి.

ఈస్టిండియాకంపెనీవారు మోగలుప్రభువుయొక్క హక్కులోనున్న ప్రదేశములఁ గొన్నిటి నాక్రమించుకొనఁగా నాప్రభువు రామ మోహనరాయలకు రాజాబిరుద మొసంగి, దొరతనమువారితో నా విషయమై ప్రసంగించి తనహక్కులను తన కిప్పించుమని వేడెను. రామమోహనరాయలు కంపెనీవారిదొసగులను ప్రభుత్వమువారికి తెలియఁజేసి మోగలుప్రభుహక్కులోనున్నప్రదేశముల నాతని కిప్పించెను.

హిందూదేశీయులకు రాజ్యపాలనమున నేయధికారమును లేకుండుట గమనించి రాజారామమోహనరాయలు 'దేశములోని ప్రజలసదభిప్రాయము బడయవలెనన్నచో బాధ్యతగల మంచి యుద్యోగములను వారి కొసంగవలె'నని హెచ్చరించెను. ఆతని హెచ్చరిక కనుకూలముగఁ బ్రభుత్వము

వారు 1833వ సంవత్సరమున చార్టరు శాశనము నాచరణలోఁ బెట్టిరి.

రాజారామ మోహనరాయల కీర్తిచంద్రికలు హిందూ దేశము, ఇంగ్లాండు దేశములందెగాక విదేశములందును వ్యాపించెను. ఆతఁడనేక దేశముల సందర్శింపఁగలిగెనుగాని ఫ్రాన్సు దేశమునుమాత్రమే సందర్శింపఁగలిగెను. ఫ్రాన్సుదేశము నపుడేలుచున్న లూయీ ఫిలిప్ ప్రభువు రామమోహన రాయల నాహ్వానించి గౌరవించెను.

చార్టరు శాసన (Charter act) మమలులోనికి వచ్చినపిదప రామమోహనరాయలు హిందూదేశమునకుఁ దిరిగి వచ్చుచుండఁగా వ్యాధిగ్రస్తుడయ్యెను. ఆవ్యాధి విషమముగ పరిణమించెను. ఆతఁడు 27-9-1833వ సంవత్సరమున బ్రిస్టలువద్ద చనిపోయెను.

రాజారామమోహననాయలమరణవార్తవిని దేశీయులేగాక విదేశీయులును మిక్కిలి వగచిరి.

# సర్. టి. ముత్తుస్వామి అయ్యరు

దక్షిణహిందూదేశమున సర్ తిరువాలూరు ముత్తుస్వామిఅయ్యరు పేరు వినని వారుండరు. దక్షిణదేశస్థుల కాతఁడన్న నెంతయో గౌరవము. ఏదైన నీతు లెవరికైన నుపదేశించుచున్నపుడు "చూడుము, ముత్తుస్వామి అయ్యరెంత బుద్ధిమంతుఁడో" యని యిప్పటికిని నతనియాదర్శక జీవితమునుగూర్చి తలఁచుచుందురు. అతఁడు సద్గుణ గరిష్ఠుఁడగుటచేతను, దయార్ద్రహృదయుఁడగుటచేతను ప్రజలకుఁ బ్రేమాస్పదుఁడయ్యెను.

ముత్తుస్వామిఅయ్యరు 1832-వ సంవత్సరమున తంజావూరునగరసామీప్యముననున్న యొకకుగ్రామమున జన్మించెను. అతఁడు పసితనముననే పితృవిహీనుఁడయ్యెను. ఆతనిజనని శోకసాగరమునమునింగెను. కాని ధైర్యము తెచ్చుకొని తనసుతునితో తిరువాలూరు అనునూరికిఁబోయెను. ముత్తుస్వామి అయ్యరు బీదవాఁడు. ఆ మాతాసుతులు తిండికొఱకనేకకష్టము లనుభవించుచుండిరి. కొంతకాలమాతఁడు తిరువాలూరుపాఠశాలలోఁ జదివెను. కాని

దారిద్ర్యబాధ దుస్సహమగుటచే విద్యాభ్యాసముమాని యతఁడాయూరుకరణమువద్ద గుమాస్తాగా ప్రవేశించెను. ఆ కరణము ముత్తుస్వామిఅయ్యరునకు మాసమునకొక రూపాయి వేతన మేర్పఱచెను.

కొంత కాలమైనపిదప నతఁడాకరణమువద్దనే యసిస్టెంటు కరణముగఁ బనిచేసెను. ఈ సమయమున నతని తల్లికూడ మరణించెను. పాపము! దిక్కులేనివాఁడగు ముత్తుస్వామిఅయ్యరున కాకష్టసమయమున సాయముచేయుటకుఁగాని, తగినసలహానొసంగుటకుఁగాని యెవ్వరును పూనుకొనకపోవుటచే నాతఁ డత్యధికవిచారనిమగ్నుఁడయ్యెను.

ముత్తుస్వామిఅయ్యరు అదృష్టవశమున 1846 వ సంవత్సరమున తిరువాలూరుతహసీల్దారగు ముత్తుస్వామి నాయక్ అనునాతనినిఁ జూచుట తటస్థించెను. కరుణార్ద్రచిత్తుఁడగు నాతహసీల్దారు పేదవాఁడగుముత్తుస్వామి అయ్యరును బిలిచి ''నీ తండ్రిమరణమునకే వగచుచుండఁగా, నీతల్లి మరణించి నీకు మఱింత వంతకలుగఁజేసినది. నీవు దుఃఖింపవలదు. ఈ దినముమొదలుగా నాయింట నుండుము.'' అని చెప్పెను.

తహసీల్దారు చెప్పినపనులన్నియు నతఁడు చక్కఁగ నెఱవేర్చుచుండెను. ఆతనివినయవిధేయతలకును, తెలివి

తేటలకును తహసీల్దారు సంతసించెను. యజమానునికి సేవ చేయనిసమయములం దాయూర నేయున్న పాఠశాలకుఁబోయి, యతఁడాంగ్లభాష నభ్యసింపసాగెను. ముత్తుస్వామి అయ్యరాంగ్లభాషాపఠనమునం దాసక్తుఁడై యుండుట తహసీల్దారు గమనించి, తానే యతని కాంగ్లభాష నేర్పెను. పాఠశాలకుఁబోయి పాఠములభ్యసము చేసికొనగలఁడని ధైర్యముతోఁచిన పిదప, ముత్తుస్వామి నాయకాబాలుని నాగపట్నకెళ్ళి స్తవపాఠశాలకు విద్యాభ్యాసమునిమిత్తము పంపెను. ఆపాఠశాలలో విద్యాభ్యాసము ముగిసినతరువాత మహోదారస్వభావుఁడగు నాతహసీల్దారే ముత్తుస్వామి అయ్యరును మదరాసు యూనివర్సిటీ కాలేజి హైస్కూలుకుఁ బంపెను. ముత్తుస్వామిఅయ్యరు తన తెలివితేటలచేతను, వినయవిధేయతలచేతను ఉపాధ్యాయులెల్లరి దయకును పాత్రుఁడయ్యెను. యునివర్సిటీ కళాశాల కపుడు ప్రధానాచార్యుఁడుగా (Principal) నుండినపవెలుదొరగారు ముత్తుస్వామిఅయ్యరునెడ నత్యధికమగునభిమానము గలిగియుండెను. తాను విద్యాధికుఁడగుటకు ముఖ్యముగా పవెలు దొరగారి * యభిమానమే హేతుభూతనిమ ముత్తుస్వామి అయ్యరు చెప్పుచుండెడివాఁడు.

* పవెలు దొరగారి శిలాప్రతిమ రాజధాని కళాశాల నలంకరించుచున్నది.

కళాశాలయందు విద్యనభ్యసించిన యనంతర మాతఁడా కళాశాలలోనే యఱువదిరూప్యముల వేతనముపై సహోపాధ్యాయుఁడుగ నియమింపఁబడెను. కొంతకాలమైన పిదప నతఁడు తంజావూరుజిల్లా కలెక్టరుకచేరిలో గుమాస్తా యుద్యోగమును జేసెను. ఆతఁడెంతో కాల మీయుద్యోగమునఁగూడనుండలేదు. రూ 150 ల వేతనముపై విద్యాశాఖాధికారులచే డిప్యూటీ స్కూల్సు యినస్పెక్టరుగ నియోజితుఁడయ్యెను. 1853 వ సంవత్సరమున ముత్తుస్వామి అయ్యరు ప్లీడరు పరీక్షలో నుత్తీర్ణుఁడయ్యెను. కొంతకాలము ప్లీడరు చేసినతరువాత నాతఁడు ట్రాంక్వెబారు జిల్లా మునసబుగ నియమింపబడియెను.

1859 సంవత్సరమున దొరతనమువారు ముత్తుస్వామి అయ్యరుకు తంజావూరుజిల్లా యీనాము డిప్యూటీ కలక్టరు పదవి నొసంగిరి. కొన్ని సంవత్సరములు గడచినపిమ్మట నతనికి మేజస్ట్రేటు అధికారముకూడ నొసంగబడెను. ముత్తుస్వామి అయ్యరు తనయుద్యోగము నత్యంత సామర్థ్యముతో నిర్వహించుచుండెను. అభియోగ విచారణము నందాతఁడు చూపు కౌశలమును బరీక్షించి ప్రభుత్వమువా రతని దక్షిణ కెనరా సబుజడ్జిగను, కొన్ని మాసములు గడచిన పిదప మదరాసు పోలీసుమేజస్ట్రేటుగను నియమించిరి. ముత్తుస్వామి అయ్యరు మేజస్ట్రేటుపనిచేయుచు విరామకాలములందు

బి. యల్. పరీక్షకు చదువసాగెను. ఆపరీక్షయందాతఁడు విజయుఁడైనంతనే చెన్నపురి స్మాల్ కాజుకోర్టు జడ్జిగ నియోజితుఁడయ్యెను. ఆతఁడనేకజర్మనీలాపుస్తకములను (German law Books) జదివెను.

1877-వ సంవత్సరమున ముత్తుస్వామిఅయ్యరు ఢిల్లీ దర్బారు కాహ్వానింపఁబడియెను. మఱుచటి సంవత్సరమాతనికి దొరతనమువారు సి. ఐ. ఇ. (Companion of the Indian Empire) బిరుదము నొసంగి హైకోర్టు జడ్జిగ నియమించిరి. చెన్నపట్టణమున హైకోర్టుజడ్జిపదవినందిన హిందువులలో ముత్తుస్వామి అయ్యరే ప్రథముఁడు.

ముత్తుస్వామిఅయ్యరు చెన్నపురిపౌరులకేగాక తక్కిన ఆంగ్లేయులగున్యాయమూర్తులకుఁగూడ నాదర పాత్రుఁడయ్యెను. సబుకోర్టు జడ్జీలు, స్మాలుకాజుకోర్టు జడ్జీలు చాలమంది ముత్తుస్వామి అయ్యరునొద్ద శిక్షణము పొందినవారే. ఆతనికిఁగలయోర్పు, బుద్ధికౌశలము ప్రశంసింపఁదగినవి. న్యాయము గమనించి తీర్పునొసంగెడివాఁడగుటచేతనే, ముత్తుస్వామిఅయ్యరు సుప్రసిద్ధ న్యాయమూర్తి (Judge) యయ్యెను.

అభియోగ విచారణమున న్యాయముతో ప్రవర్తించుటయేగాక ముత్తుస్వామిఅయ్యరు న్యాయమున (Law) అనేక మార్పులఁగావించెను. రాజభక్తియుక్తుఁడై మెలఁగిన

ముత్తుస్వామి అయ్యరు 1892-వ యేట ప్రభుత్వమువారిచే కె. టి. (Knight) అను బిరుదముచే బహూకరింపఁబడెను. ఆతఁడు పదునేడుసంవత్సరములు హైకోర్టుజడ్జిగను, కొన్ని మాసములు ప్రధానన్యాయమూర్తిగను బనిచేసెను. ముత్తుస్వామి అయ్యరుఆరోగ్యమునకు 1895-వ సంవత్సరమున భంగమొదవెను. ఆవత్సరముననే యతఁడు మరణించెను. ఆతని శిలాప్రతిమ మదరాసు హైకోర్టు నలంకరించుచున్నది.

# రాజా రవివర్మ

హిందూదేశము చిత్రకళకుఁ బుట్టినిల్లు. దేశకాల పరిస్థితులందలి పరివర్తనములవలనఁ జాలభాగ మంతరించినను, కొలఁదిభాగ మింకను నిలిచియు నున్నది. చిత్రకళాభివృద్ధి కనేకకళాశాలలు నెలకొల్పఁబడినవి. పూర్వపు శిల్పమునకు, చిత్రకళకు చిహ్నములుగా ననేక దేవాలయములు, గుహలు, దేశనాయకులశిలావిగ్రహములునుండి ఆధునిక చిత్రకారుల కత్యంత ప్రోత్సాహ మొనగూర్చినవి సురేంద్రనాథగంగూలీ, అవనీంద్రకుమారటాగోరు, మహాత్రి, రవివర్మ, దామెర్ల రామారావు మున్నగు సుప్రసిద్ధ చిత్రకారులు చిత్రకళ నపారముగ వృద్ధిఁగావించిరి. వారి నాదర్శముగ దీసికొని, ఆధునిక చిత్రకారులనేకులు కళామందిరముల నెలకొల్పి తమజీవితమును చిత్రకళాభివృద్ధికర్పించుచున్నారు. పై నుదహరించిన విఖ్యాతచిత్రకారులలో రవివర్మ ముఖ్యుఁడు.

రవివర్మ 1848 వసంవత్సరమున తిరువాన్కూరు జిల్లాలో నొక కుగ్రామమున జన్మించెను. ఆతనిపూర్వులు దక్షిణదేశమున గొంతభాగము నేలియుండిరి. వారిలోఁ గొందఱు చిత్రకారులు. మఱికొందరు పండితులు.

రవివర్మకు బాల్యమునుండియు చిత్రలేఖనము నందభి రుచియుండెను. ఆతని మేనమామయగు రాజారాజవర్మ వినుతికెక్కిన చిత్రలేఖకుఁడు. ఆతనిచిత్రలేఖనప్రావీణ్యము రవివర్మ నధికముగనాకర్షించెను. రవివర్మయభిలాషను రాజవర్మగమనించి, యాతనిఁగూడ నాకళలో నిపుణునిగఁ జేయ సమకట్టెను.

రవివర్మపదునాల్గవసంవత్సరమున, రాజవర్మ యాతఁడు లిఖించిన చిత్రములను తిరువాన్కూరు మహారాజునకుఁ జూపెను. మహారాజా చిత్రవిలోకనమున విస్మయచకితుఁడై యతనికొకరంగులపెట్టెను బహుమానముగ నొసంగెను. 1865 వసంవత్సరమున రవివర్మ మహారాజకుటుంబములోని యొక బాలికను పరిణయమాడెను. వివాహానంతరమాతఁడు రాజప్రాసాదముననే నివసింపవలసినవాఁడయ్యెను. ఆ దివ్య సౌధముననున్న చిత్తరువుల నాదర్శముగఁగైకొని రవివర్మ యనేకచిత్రపటముల నుల్లేఖించెను.

1874 వ సంవత్సరము జనవరిమాసమున చెన్నపట్టణ మున జరిగిన చిత్రకళాప్రదర్శనమున రవివర్మచిత్తరువు గవర్నరుపతకమును బడసెను. అపుడు గవర్నరుగానున్న హోబర్టు ప్రభువు రవివర్మకొకటుఁగబురంపి యతనిని వివిధ ముల నభినందించెను. హోబర్టుప్రభువునకుఁ బిమ్మట మద రాసు గవర్నరుపదవినందిన డ్యూక్ ఆఫ్ బకింగుహాము

ప్రభువు రవివర్మచిత్తరువులను కడుంగడు ప్రశంసించి తానొకటి ఖరీదునకుఁ గొనుటయేగాక తనచిత్తరవునుగూడ వ్రాయించుకొనెను.

రవివర్మ భారతేతిహాసములనుండి యనేకచిత్తరువుల వ్రాసెను. ఆతఁడే చిత్రము వ్రాసినను నయ్యది అతిత్వరితముగ ఖర్చయిపోవుచుండెను. రాజులు, మహారాజులు, భాగ్యవంతులు, సామాన్యులు రవివర్మచిత్రములఁగొనుచుండిరి. రవివర్మపట మలంకరించనిగృహము భారతదేశమున లేదనియే చెప్పవచ్చును.

ఆతఁడొకచిత్రకళామందిరమును నెలకొల్పి యనేకమంది విద్యార్థులకుఁ జిత్రలేఖనము నేర్పెను. ఆతనిపటములలో మోహినీరుక్మాంగద అత్యంత మనోహరమైనది. ఇయ్యది మదరాసునగరమున పాంథియనురోడ్డునందున్న మ్యూజియము నలంకరించుచున్నది. విశేషపరిశ్రమమూలమున నతనిదేహారోగ్యము చెడిపోయెను. ఆతఁడు 1906 వ సంవత్సరము అక్టోబరు నెలలో మరణించెను.

ఆతఁడు ప్రసిద్ధిఁగాంచుట కాతనికిఁ జిత్రకళయందుఁ గల యభిరుచియే ముఖ్యకారణము. సక్రమ చిత్రకళా బోధనము లేకున్నను, చిత్రకారుల సాహాయ్యము లేకున్నను, పాశ్చాత్యదేశచిత్రకళను పరిశీలించకపోయినను చిత్రకారులలో నతఁడగ్రస్థానము వహించెను. ఆతనికీర్తిచంద్రికలు దిగంతములవఱకు వ్యాపించెను.

# జేంసెట్జీ నుసర్ వాంజి తాత

పారిశ్రామిక విషయమున హిందూదేశ మొకప్పుడత్యధిక విఖ్యాతిఁ జెందియుండెను. అత్యంతకోమలమైన డక్కా-మస్లినుమన దేశములోనిదేగదా? కాశ్మీరశాలువను హిందూదేశ మెంతగా వినుతికెక్కినది? రానురాను హైందవ పరిశ్రమలన్నియు క్షీణదశలోనికి వచ్చినవి. కాని యిప్పుడు మరల పరిశ్రమాభివృద్ధికి సూచన లగపడుచున్నవి. బ్రిటిషుప్రభుత్వమువారుగూడ పారిశ్రామికవిషయమున హైందవపారిశ్రామికులతో నేకీభవించి, తదభివృద్ధికిఁ బాటుపడుచున్నారు. హిందూదేశమున పారిశ్రామికులలో నగ్రస్థానమునలంకరించుచున్న జేంసెట్జీ నుసర్ వాంజీ తాతజీవిత చరిత్రము పరికింతము.

1839 వ సంవత్సరమున బరోడావద్దనున్న నవసారి గ్రామములోనితఁడు జన్మించెను. ఈతనితలిదండ్రులు పర్షియా దేశవాసులు. ఈతఁడు తన బాల్యమును మతగ్రంథ పఠనమున గడపెను. పదునాల్గుసంవత్సరములప్రాయము ప్రాపించినంతనే నుసర్వాంజీతాత నతనిజనకుఁడు విద్యాభ్యాసమునిమిత్తము బొంబాయి ఎల్ఫినుస్టనుపాఠశాలకుఁ

బంపెను. 1858 వ వత్సరమున నతఁడు చదువుమానివేసి తండ్రితోఁ గలసి చైనాదేశముతో వ్యాపారముచేయ నారంభించెను. వాణిజ్యవిషములలో తగిన నేర్పుగడించిన పిమ్మట నతఁడు వస్త్రకరహస్యములను విశేషముగఁ దెలిసికొనుటకై హాంకాంగు పట్టణమునకుఁ బంపఁబడియెను.

ఈ సమయమున అమెరికాలో నంతః కలహ మారంభమయ్యెను. అమెరికా ఖండమునుండి ప్రత్తి ఐరోపాఖండమునకు విశేషముగా నెగుమతియగుచుండెను. సంగ్రామము ప్రారంభమైనంతనే అమెరికాఖండమువారు ప్రత్తినెగుమతి చేయుట మానిరి. ఈ యుక్కఅ గమనించి హిందూదేశమునుండి అనేకు లైరోపాఖండమునకు ప్రత్తి నెగుమతిచేయ సాగిరి. నుసర్‌వాంజితాత హాంకాంగునుండి బొంబాయికి తిరిగివచ్చి, తానుకూడ ప్రత్తినెగుమతిచేయసాగెను. కాని 1865వ సంవత్సరములో నా యుద్ధ మకస్మాత్తుగా నాపు చేయఁబడెను. హిందూదేశమునుండి ప్రత్తి తీసికొనుటమాని ఐరోపాఖండవాసు లమెరికానుండి మఱల తెప్పించుకొన సాగిరి. చాలమంది ప్రత్తివర్తకు లీయాకస్మిక సంఘటన పర్యవసానముగా దివాలాతీసిరి. తాత తనబుద్ధికౌశలములచే నష్టము రాకుండ కంపెనీని కాఁపాడుకొనెను. ఇంగ్లాండగా నబ్సీనియా దేశమునకును, ఐరోపాఖండమునకును మఱల యుద్ధము తటస్థించెను, ఆసైనికుల కాహారసామగ్రి సరఫరా

చేయుమని తాతాకంపెనీవారినాంగ్లేయు లడిగిరి. తాతా కంపెనీవారు మఱికొందఱితోఁ గలసి సైనికుల కాహార సామ గ్రిసరఫరా చేసిరి. అందులో నతనికిఁ జాల లాభము కలిగెను. కంపెనీకూడ పేరుమోసెను.

బొంబాయిలో నాసమయమున నూలు పరిశ్రమవాసి కెక్కి యుండెను. తాతాకూడా నా పరిశ్రమమును బలముగ స్థాపించవలయునని తలంచి, ఇంగ్లాండు దేశమునందున్న మాంచెస్టరు నగరమున కరిగెను. పరిశ్రమాభివృద్ధి కుప యుక్తములగు విషయముల నాతఁ డెన్నింటినో యానగర మున గ్రహించెను. ఆతఁడు హిందూదేశమున కరుదెంచి నాగపూరున నొక ఫ్యాక్టొరీ నిర్మించెను. విక్టోరియా మహారాణి హిందూదేశమునకు చక్రవర్తిని అని ప్రచురింపఁబడిన శుభ దినమున (1-1-1877) మధ్య పరగాణల చీఫ్ కమీషనరగు సర్ జాన్ మారిస్‌చే నా "ఎంప్రెస్‌మిల్" తెఱువఁబడెను. నుసర్ వాంజితాత స్వయముగ ఫ్యాక్టొరీవ్యవహారములఁ జూచుచుండెను. వ్యాపారాభివృద్ధి కనువగు రహస్యములఁ దెలిసికొనుట కాతఁ డనేక పర్యాయము లైరోపాఖండమున కరిగెను. కొలఁదికాలములోనే నుసర్‌వాంజితాత మిగత ర్తకు లాశ్చర్య చకితులై మత్సర గ్రస్తులగు నంతటి ప్ర ఖ్యాతిఁ గాంచుటయేగాక, అపరిమితమైన లాభమందెను.

భాగ్య మదాంధుఁడై యతఁడు ఫ్యాక్టొరి పనివాండ్ర ను, తనక్రింది యుద్యోగులను బాధించక వారిని దయతోఁ జూచుచుండెను. వారికి బహుమానము లొసంగియు, జీతముల నెక్కువచేసియు ప్రోత్సహించుచుండెను. మఱియు నుత్సాహవంతులు, విద్యాధికులునగుయువకులను ప్రతి సంవత్సరమును వర్తకులుగా తయారుచేయసాగెను. ఇవన్నియు నుసర్వాంజితాత ఫ్యాక్టొరి యితరుల కాదర్శకమగునట్లొనర్చెను.

ధనలాభముకలిగెడుకొలంది నుసర్వాంజితాత వ్యాపారము నింకను వృద్ధిచేయ దొడంగెను. సన్ననినూలు నతఁడు తయారుచేయు నుద్దేశముతో స్వదేశీ యంత్రాగారమును స్థాపించి, అనేకనూతనయంత్రములను దెప్పించెను. అత్యధిక వ్యయప్రయాసల కోర్చి చేసిన యీ కార్యమును చిరకాలమున తాతాకంపెనీవారి కద్భుతమైన లాభ మొదవించెను. హైందవవర్తకులేగాక, ఆంగ్లేయవర్తకులును నుసర్వాంజితాతకు పారిశ్రమిక విషయమునఁ గల కౌశలమునకు విస్మయపరీతచేతస్కులైరి. తదనంతర మాతని దృష్టి ప్రత్తి వ్యవసాయముపైఁ బ్రసరించెను. ఈజిప్టుదేశీయులు ప్రత్తి సేద్యమున కనుసరించిన విధానము లత్యంత లాభకరములైనవని యాతఁడు గ్రహించి, ఆ యాపద్ధతులన్నియుఁ దెలుపు నొక గ్రంథమును బ్రచురించెను. కర్జనుప్రభువువ్యవసాయ

విషయమున మార్పులు గావించినపుడీ గ్రంథమందలివిషయము లత్యధికలాభకరములని వెల్లడించి, యీ విధమున సేద్య మొనరింప హిందూదేశపు రైతుల హెచ్చరించెను. రైతు లందఱు నప్పుడా విధానముల ననుసరించి ప్రత్తి వ్యవసాయము చేసి ప్రాప్తలాభముదితమానసులైరి.

ప్రత్తి వ్యవసాయము చేయుటతో ప్రత్తిపరిశ్రమ సంపూర్ణమైనదని తలంపరాదు. ఆ పరిశ్రమను వృద్ధిచేయుటలో నుసర్వాంజితాత మిక్కిలి పాటుపడెను. ప్రత్తి నాతఁడు మిగత యెగుమతిదారులు చేయుధరలు హెచ్చుగానుండుట గమనించి, యట్లొనరించుట కేవల మన్యాయమని భావించి, వారిధరలలో నిరువదవవంతు ధరకు జపాను, చైనా దేశములకు విరివిగ నెగుమతి చేయ మొదలిడెను. తక్కుంగల యెగుమతిదారులు నిశ్చేష్టులై, తాముకూడ నాధరలకే పంపవలసినవారైరి. విదేశములకు ప్రత్తి నెగుమతిచేయుటలో తాతా కంపెనీవారు గణనాతీతమైన లాభమును బడసిరి.

నుసర్వాంజి తాత తన యఖండైశ్వర్యము నేవిధమున సద్వినియోగ మొనరించెనో పరికింపవలసియున్నది. భారత దేశాభిమానియగు నాతఁడు పరిశ్రమ లభివృద్ధినొందినచో దేశమున దారిద్ర్యమునకు తావుండదని యతఁడు విశ్వసించియుండెను. పారిశ్రామికాభివృద్ధికి శాస్త్రీయవిజ్ఞాన మవసరమని యాతఁడెంచెను. శాస్త్రీయవిజ్ఞానము బడయుటకు

విద్యముఖ్యము. విదేశయాత్రయును, విదేశశిక్షణమును, చారిత్రిక భాషాజ్ఞానములును పరిశ్రమాభివృద్ధికి ప్రధాన కారణములనియు, పరిశ్రమాభివృద్ధి దేశౌన్నత్యమునకుఁ దప్పక తోడ్పడుననియు నాతఁడు తలంచియుండెను. ఈ విషయమును కొనసాగించుటకు నుసర్ వాంజితాత అనేక మంది బీదయువకుల కుచితవేతనము లొసంగి విదేశములకుఁ బంపెను. ఎల్లరిని విదేశములకుఁ బంపుట కష్టమనియు, కొందఱికేగాక యందఱకునుగూడ నవకాశ ముండవలయు నని భావించి యాతఁడొక కళాశాల నేర్పఱచెను. విద్య, శాస్త్రము, పరిశ్రమలు, వైద్యము, వేదాంతము ఆకళా శాలలో నేర్పు యేర్పాటుల నాతఁడు గావించెను. ఆకళా శాలకు సంవత్సరమున కెనిమిదివేల రూపాయలుచొప్పున పది సంవత్సరముల కెనుబదివేల రూపాయల గ్రాంటు నొసంగు టయేగాక, ముప్పదిలక్షల రూపాయలను విరాళముగ నొసం గెను. కళాశాలాభవన నిర్మాణమునకుఁ గావలసినస్థలము నుచితముగా నొసంగెదమనియు, నాకళాశాలను బెంగు ళూరులో నేర్పఱచుట మంచిదనియు మైసూరు ప్రభుత్వము వారును సర్ వాంజితాతకు సలహా నొసంగిరి. వారిసలహా ననుసరించి, యాతఁడాకళాశాలను బెంగుళూరులో నే సాపించెను.

కొన్ని సంవత్సరములు సుప్రసిద్ధపరిశోధకులసాహాయ్యమున విశేషపరిశోధన మొనరించి నుసర్ వాంజితాత హిందూదేశమున నినుముగను లపరిమితముగ నున్నవని కని పెట్టెను. ఆ ముతకలోహముప్రక్క బొగ్గుకూడ నుండునని పరిశోధకులు నుడివిరి. తాత విశేషమూలధనము నాపరిశ్రమమునకు వినియోగపఱచెను. ఆతనిప్రయత్నములు క్రమముగా సఫలము లయ్యెను. కాని యాతని యత్నములు సఫలములు కాకుండగనే యతఁడు కాలగర్భమునఁ గలసిపోయెను. అనేక యంత్రాగారములు శక్చిఅను గ్రామమున నిర్మితములయ్యెను. గనులలో లభించెడి యినుము మంటితో గలసి యుండును గదా. ఆముతకలోహమునుండి తాతా కంపెనీవారియంత్రాలయములందు పరిశుద్ధమైన దుక్క యినుము తయారుచేయబడుచుండెను. హిందూదేశమున వైస్రాయిగఁ బనిచేసిన చెలమ్సుఫర్డుప్రభువు 2-1-1919సం॥ రమున నాశక్చి గ్రామమునకు నుసర్ వాంజితాత జ్ఞాపకార్థము జముషెడు పురమని పేరుపెట్టెను. దానినే తాతానగరనికూడ చెప్పుచుందురు. రైలుబద్దెలన్నియు తాతాకంపెనీవారి యంత్రాగారములందే తయారగుచున్నవి. ఈకంపెనీవారి యంత్రాలయములందు తయారుచేయఁబడినరైలుబద్దెలు హిందూదేశముననే గాక మెసపటోమియా, తూర్పు ఆఫ్రికా, ఈ జప్టుదేశములకుఁగూడ నెగుమతి యయ్యెను. ఇందువలన

కంపెనీ యంత్రాలయము లందెంతయినుము తయారగునో మారే యూహించగలరు. జలమునందద్భుతమైనశక్తి యిమిడి యున్నదనియు నాశక్తినుండి విద్యుచ్ఛక్తి యుద్భవింపఁగలదని నుసర్ వాంజితాతా గ్రహించెను. విద్యుచ్ఛక్తి నుత్పాదింపఁ జేయుటకుఁ గొన్ని ప్రయత్నముల నతఁడొనరించెను. ఆతని మరణానంతర మదివఱకతఁడు వేసిన పునాదులపై నొక కంపెనీ స్థాపించఁబడెను. తాతా హైడ్రో ఎలెక్ట్రిక్ పవర్ సప్లయికంపెనీ అను పేరున నయ్యది పనిచేయుచున్నది.

1903 సంవత్సరమున నుసర్ వాంజితాత హృద్రోగస్థుఁడై వైద్యుల సలహాననుసరించి 1904 సంవత్సరమున నైరోపాఖండమున కరిగెను. ఆ వత్సరముననే యతనిసతియుఁ బరలోకమునకుఁ బోయి యాతనిని విచారసాగరమున ముంచెను. ఆమె చనిపోయిన కొలఁది మాసములకే నుసర్ వాంజి తాతయు మరణించెను. హైందువులేగాక ఆంగ్లేయులు నతని మరణమునకు మిక్కిలి దుఃఖించిరి.

# రమేశ చంద్రదత్తు

రమేశ చంద్రదత్తు 1848వ సంవత్సరమునఁ గలకత్తా నగరమున జన్మించెను. ఆతఁడు కులమునుబట్టి కాయస్థుఁడు. ఆతనిజనకుఁడపుడు వంగదేశమున జిల్లాకలక్టరుగఁ బనిచేయుచుండెను. ఆతఁడు బాల్యమున తనతండ్రియుద్యోగము చేసిన యూళ్లన్నియుఁ దిరిగి యపరిమితవిజ్ఞానము నార్జించెను. దురదృష్టవంతుఁ డగుటచే నతఁడు బాల్యదశయందే మాతాపితృ విహీనుఁడాయెను. తలిదండ్రులను గోల్పోయిన రమేశచంద్రుని శచీచంద్రుఁడను నతని మేనమామ యాదర పూర్వకముగ తనగృహమునకుఁ గొంపోయి శ్రద్ధతోఁ బెంచసాగెను. శచీచంద్రుఁ డాంగ్లభాషాభిమానియగుటచే రమేశుని విద్యావిషయమున నెక్కువ శ్రద్ధగలిగియుండెను. 1864వ సంవత్సరమున రమేశచంద్రుఁడు ప్రవేశపరీక్షలో తన తరగతికి ప్రథముఁడుగ నుత్తీర్ణుఁడయ్యెను. 1866వ సంవత్సరమున నాతఁడు యఫ్. ఏ. పరీక్షయందు రాజధానిలో ద్వితీయ స్థానమున విజయము, గాంచెను.

కలక్టరు పదవుల వాంఛించు యువకులప్పుడు లండను నగరమున ఇండియను సివిలు సర్వీసు (I.C.S.) పరీక్షకు జదువ

వలసి యుండెను. ఆ పరీక్షకుఁ జదువుట చాల కష్టమే యైనను అనేకమంది హిందువులు లండనువెళ్లి చదువుకొనెడివారు. రమేశచంద్రుఁడా పరీక్షకుఁ జదువ కుతూహలపడెను. సుప్రసిద్ధ వక్తయగు సర్ సురేంద్రనాథ బెనర్జీ తనతండ్రియను మతిఁ గైకొని యపు డింగ్లాండు దేశమునకుఁ బోవుచుండెను. ఈ విషయము తెలిసికొని తానుకూడ లండను పట్టణమున కరిగి ఐ. సి. యస్. పరీక్షకుఁ జదివెదనని రమేశచంద్రుఁడు ప్రయాణ సన్నద్ధుఁడై తన మామతోఁ జెప్పెను. శచీచంద్రుఁ డందుల కంగీకరించలేదు. రమేశుఁడు దుఃఖితుఁడయ్యెను. సురేంద్రనాథ బెనర్జీయును, రమేశచంద్రదత్తును బాల్య స్నేహితులు. సురేంద్రనాథుఁడు రమేశుఁడు బయలుదేఱుటకు రహస్యముగ నన్నియేర్పాటులును జేసెను. రమేశచంద్రుఁ డెవరికినిఁ దెలియకుండ 3-3-1868 తేదిని, అర్ధరాత్రమున గృహమునుండి నిర్గమించెను.

లండనునగరమున రమేశచంద్రుఁ డానందమయ జీవితమును గడపెను. చాలమంది ఆంగ్లేయులకు స్నేహితుఁ డయ్యెను. ఆంగ్లేయసమాజమున నాతఁడు స్వేచ్ఛగఁ బ్రవర్తించుచుండెను. గ్లాడ్సుటను, బ్రైటు, డిసరెలీ మున్నగు సుప్రసద్ధాంగ్లేయవక్తల యుపన్యాసముల నాతఁడాలకించెను. ఆతఁడు లండను యూనివర్సిటికాలేజిలోఁ జదువుచుండెను. ఆతఁడు థియోడోరుగోల్డుస్టకరు, హెన్రీమార్లీమున్నగు

సంస్కృతాంగ్లేయ విద్వాంసుల పరిచయము గావించుకొనెను ఆతనిసుందరగంభీరాకృతియు, సుగుణములు నెల్లరి నాకర్షించెను. దత్తు ఐర్లండు, స్కాట్లండు దేశముల సందర్శించి, విజ్ఞానోద్బోధకములగు ననేక విషయములను గ్రహించెను. హైందవులేగాక, ఆంగ్లేయులుగూడ విస్మితులగునట్టి కార్యముల నాచరించవలెనని యుత్సాహవంతుఁడగు రమేశచంద్రుఁడు సంకల్పించుకొనెను. ఆతఁ డీ యాశయముతోఁ బరీక్షకు శ్రద్ధగా చదివెను. 1869వ సంవత్సరమున నతఁడు గీర్వాణ భాషలోఁ బ్రథమస్థానమునను, ఆంగ్లభాషలో ద్వితీయ స్థానమునను, అన్ని విషయములందును (All subjects) తృతీయ స్థానమునను, నుత్తీర్ణుఁ డయ్యెను.

స్వదేశమునకుఁ దిరిగి వచ్చుటకుఁ బూర్వము, సురేంద్రనాథుఁడును, రమేశ చంద్రుఁడును, ఫ్రాన్సు దేశము నుపలక్షింపవలయునని వెళ్లిరి. అపుడా దేశ మొకమూల విప్లవములవలనను, మఱొకవంక జర్మనులతోడియుద్ధములవలనను నల్లకల్లోలమై, శాంతిరహితస్థితిలోనుండెను. రాజ్య మరాజకముగ నుండెను. విప్లవకారులని యనుమానము జనించినంతనే రాజభటులు వారిని కారాగృహములందు బంధించుచుండిరి. రమేశ చంద్రుఁడును సురేంద్రనాథుఁడును వి ప్లవ కారులని యనుమానింపఁబడి, రాజకీయోద్యోగులచే బంధింపఁబడి, యొకరేయి కారాగారమున గడపిరి. కారా

గృహాధికారి మఱునాఁటి యుదయమున నమాయికులగు నా హైందవయువకులు నిరపరాధులని తీర్మానించి విడిచి పెట్టెను.

రమేశచంద్రదత్తు కలకత్తాకుఁబోయినంతనే ప్రభుత్వము వారతనిని బంగాళారాజధానిలో నొక జిల్లాకుఁ గలక్టరుగ నియమించిరి. ఆతఁడా యుద్యోగము నాఱుసంవత్సరము లత్యంత కౌశలముతో నిర్వహించెను.

1876 వ సంవత్సరమున దక్షిణ శహజాపురమను దీవిని గంగానదీవరదలు ముంచివేసెను. అనేకులు నివసించుట కిండ్లులేక, భుజించుట కాహారములేక చాలబాధపడిరి. ఆహారము లభించుటే కష్టమయ్యెను. తిండిలేనివారు భాగ్యవంతుల గృహములందుఁ జొరఁబడి చౌర్యమునలుపనారంభించిరి. విప్లవములుకూడ చెలరేగ సాగెను. ప్రభుత్వమువారియను మతిఁ గైకొని రమేశచంద్రుఁ డాదీవిలోనియల్లరుల నణచి శాంతి నెలకొల్పుటకు సంసిద్ధుఁ డాయెను.

మహా మేధావియగు నాతఁడు దీవిలో గృహములు లేక యల్లాడుచున్న బీదలకు గృహములు నిర్మింపఁజేసెను. ఆహారములేక పరితపించువారి కాహారసామగ్రినొసంగి, వృత్తుల నేర్పఱచి ప్రజల క్షామమునివారించెను. దొరతనము వారిందుల కాతని నభినందించిరి.

ఉద్యోగనిమగ్నుఁడై యున్నను రమేశచంద్రుఁడు సారస్వతసేవాతత్పరత మఱువలేదు. గీర్వాణాంగ్ల భాషలలో ప్రవీణుఁడై యుండినను, ప్రథమమున మాతృభాషయగు వంగభాషలో నేవైన గ్రంథముల రచించవలయునని యభిలషించెను. సుప్రసిద్ధ వంగ నవలాకారుఁడగు బంకిమచంద్ర చట్టోపాధ్యాయుని ప్రోత్సాహమున నతఁడైదు నవలలను వ్రాసెను. ఆ నవలలనతికాలములోనే వంగీయుల ప్రశంసలకుఁ బాత్రమయ్యెను. వినుతికెక్కిన కవిపుంగవు లానవలలను గూర్చి సదభిప్రాయముల నొసంగిరి. ఆనవల లిప్పటికిని వంగ సారస్వతమున నగ్రస్థానము వహించియున్నవి. వానిలో సుధా శరశ్చంద్రము (Lake of palms), మాధవీకంకణము (Slave girl of Agra) అనునవలలు నాంగ్లభాషలోనికిని, యాంధ్రభాషలోనికినిఁగూడ తర్జుమా చేయఁబడెను.

1883 వ సంవత్సరమున రమేశ చంద్రదత్తు బారిసాల్ జిల్లాకలక్టరుగ నియమింపఁబడియెను. రాజకీయ విప్లవములకు మూలస్థానమైన యాజిల్లాకుఁ గలక్టరుగ నియోజితులైన హిందువులలో నితఁడే ప్రథముఁడు. ఆతఁడా జిల్లాకు గలక్టరుగఁ బనిచేసిన వత్సరద్వయమునందే విప్లవములును చెలరేగలేదు. ఆతని సామర్థ్యమున కచ్చెరువంది, యప్పుడు కలకత్తాలో గవర్నరు జనరలుగనున్న మార్క్విసు ఆఫ్

రిపన్ ప్రభు వాతనికొలఁదిఁ గబురంపించి యనేకవిధముల నభినందించి శ్లాఘించెను.

రమేశచంద్రదత్తు పదునాల్గు సంవత్సరము లుద్యోగము చేసి బడలియుండుటచే విశ్రాంతిఁ దీసికొన నెంచెను. 1885 వ యేట నతఁడు రెండు సంవత్సరములు సెలవు తీసికొనెను. ఈవిరామకాలము నతఁడు గ్రంథరచనమునకు, విదేశయాత్రకును, వినియోగింప నిశ్చయించుకొనెను. గీర్వాణభాషలో నతఁ డఖండపాండిత్యము గలవాఁ డగుటచేఁ బవిత్రమగు ఋగ్వేదమును తన మాతృభాషలో వ్రాసి 1886 వ సంవత్సరమున ప్రచురించెను. అతఁడా యేఁడాది లోనే నార్వే యిటలీదేశములకుఁబోయి 1886 వ సంవత్సరము డిశెంబరు నెలలోఁ దిరిగివచ్చెను.

1887 వ సంవత్సరమున దత్తు మైమెనుసింగు జిల్లా కలక్టరుగ నియమింపఁబడియెను. ఆతఁ డాజిల్లా లోకలు బోర్డులం దనేకమార్పులఁ జేసెను. అచట నదివఱలో మహాభయంకరముగ చెలరేగియున్న హిందు మునల్మాను వైరముల నంతరింపఁజేసి, వారిసమ్మేళనమున కాతఁడు మిక్కిలి పాటు పడెను. అనంతర మాతఁ డత్యధికముగ పరిశ్రమ మొనరించి 1890 వ సంవత్సరమున "ప్రాచీన హిందూదేశ నాగరికత" (Civilization in Ancient India) అను మహాగ్రంథమును మూఁడుభాగములుగ వ్రాసి ప్రచురించెను.

ఆతని యారోగ్యమునకు మఱల భంగమొదవఁగా గొంత కాలము విశ్రాంతిఁ దీసికొనఁదలంచి విదేశములకుఁ బ్రయాణ మయ్యెను. ఆతఁడీ విదేశయాత్రసమయముననే లాటిను, జర్మనీ భాషల నభ్యసించెను. ఆతఁ డారోగ్యవంతుడై 1893 వ సం॥రమున హిందూదేశమున కరుదెంచెను. ఉద్యోగ నిర్వహణ సామర్థ్యమునకును, ఆంగ్ల వంగ సారస్వతసేవకును దొరతనమువారు మెచ్చి దత్తునకు హైందవసామ్రాజ్య సహాయక (C. I. E. Companion of the Indian Empire) బిరుదము నొసంగి సత్కరించిరి.

1894 వ సంవత్సరమున రమేశ చంద్రదత్తు బర్ద్వాను పరగణాకు కమీషనరుగ నియోజితుఁడయ్యెను. ఆ యుద్యోగము నాతఁడు వర్షత్రయము కడుంగడు నిపుణతతో నిర్వహించెను. తన శేషజీవితమును ముఖ్యముగా దేశభాషా సేవల యందే వినియోగించుటకుఁ గృత నిశ్చయుఁడై దత్తు 1898 సంవత్సరమున బ్రభుత్వోద్యోగమును జాలించి ఇంగ్లాండున కరిగెను. 1897 మొదలు 1904 వఱకు నతఁడు లండను విశ్వవిద్యాలయకళాశాలలోఁ (University Collge) హిందూదేశ చరిత్రాధ్యాపకుఁడుగ (Lecturer on Indian History) నుండెను. ఆతఁడప్పుడే రామాయణ మహాభారత కథలను పద్య కావ్యముగ నాంగ్లభాషలోనుశ్లేషించెను. ఆ సద్గ్రంథమునకు సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుఁడగు ప్రొఫెసరు

మాంక్సుముల్లరు విపులమగు భూమిక వ్రాసెను.

1899వ సంవత్సరమున దత్తు హిందూదేశమున కరుదెంచెను. ప్రజలతనిని లక్నోలో జరుగఁబోవు అఖిలభారత జాతీయ మహాజన సభాధ్యక్షునిగ (President of the Indian National Congress) నెన్నుకొనిరి. మహాసభ ముగిసిన పిదప నతఁ డింగ్లాండు దేశమునకుఁ బోయెను. ఆతఁ డచట మఱికొన్ని గ్రంథములను వ్రాసెను. వానిలో ముఖ్యముగా పేర్కొనఁ దగినవి (1) హిందూదేశార్థ శాస్త్రము (An Economic History of India) (2) విక్టోరియా మహారాణి కాలమున హిందూదేశచరిత్ర (India in the Victorian Age).

1904వ సంవత్సరమున రమేశచంద్రుఁడు స్వదేశమునకేగుదెంచినంతనె బరోడాదివానుపదవి యొసంగఁబడెను. ఆతఁడు పారిశ్రామికారోగ్యవిద్యాశాఖలలోఁ జాల మార్పులొనరించెను. అనేక సాంఘికదురాచారముల నాతఁడణచివేసెను. 1907వ వత్సరమున దత్తు ప్రభుత్వమువారేర్పఱచిన రాయలు కమీషనులో సభ్యుఁ డయ్యెను. ఆ కమీషను ముగిసిన యనంతరము 1909వ సంవత్సరమున హిందూదేశమునకుఁ దిరిగివచ్చెను. ఆతఁడు మఱల బరోడాదివానుగ నాహ్వానింపఁ బడియెను. కొలఁది మాసములు గడచిన వెనుక నతఁడు తనయఱువది రెండవయేట 30-11-1909 నిమరణించెను.

దత్తు రాజకీయవేత్తగను, దేశభక్తుఁడుగను, ఆంగ్లవంగ భాషాగ్రంథకారుఁడుగను వాసిగాంచెను.

# గోపాలకృష్ణ గోఖలే

గోపాలకృష్ణగోఖలే 1866 వ సంవత్సరమున కొల్హాపురమున జన్మించెను. అతఁడు బ్రాహ్మణుఁడు. 1884 వ సంవత్సరమున నతఁడు ఎల్ఫిన్స్టను కళాశాలలోఁ జదివి బి. ఏ. పరీక్షయందు విజయమందెను. అతని కనంతమైన జ్ఞాపకశక్తియుండెను. అతఁ డిరువది సంవత్సరముల ప్రాయమును దాఁటకపూర్వమే యుద్యోగము చేయవలసినవాఁడాయెను. ఆదినములలో పట్టపరీక్షయందు తీర్ణులైనవారుద్యోగములకొఱ కంతకష్టపడవలసినయవసరము లేకుండెను. గోఖలే ప్రజాసేవకవకాశముండునట్టి యుద్యోగముఁ జేయ సంకల్పించుకొనెను. 1885 వ సంవత్సరమున దక్కను విద్యాసమాజమునఁ (Deccan Education Society) జేరు నదృష్ట మాతనికిఁ గలిగెను. మహారాష్ట్రదేశమున విశేష ఖ్యాతిని గడించిన యీసమాజము 1880 వ సంవత్సరమున న్యూఇండియా పాఠశాలను స్థాపించిరి. అయిదు సంవత్సరములలో నాపాఠశాల అపూర్వాభివృద్ధి నందుటచే నాసమాజమువా రాపాఠశాలను కళాశాలగా మార్చిరి. కళాశాలా నిర్వహణము మహారాష్ట్ర ప్రముఖులపై నాధారపడియుండెను. తక్కువ జీతములపైఁ బనిచేయు యువకు లుపాధ్యాయులుగఁ బనిచేయు టత్యావశ్యకమయ్యెను. అనేకమంది

యువకులు దేశసేవ కదియే తగినయదనని తలంచి యాకళా శాలయం దుపాధ్యాయులుగఁ జేరిరి. గోఖలేకూడ మాప మునకు రు 75 ల వేతనముపై నాకళాశాలయం దుపాధ్యాయుఁడుగఁ జేరెను. ఆకళాశాలకు వారు ఫెర్గూసను కాలేజి యని పేరిడిరి. ఆతఁ డింగ్లీషు, గణితము, అర్థ శాస్త్రము, చరిత్రలను బోధించుచుండెను. సుగుణవంతుఁ డగు గోఖలే విద్యార్థులక్షేమసమాచారముల నరయుచు వారికష్టములందు తానుగూడ పాల్గొనుచు నెల్లప్పుడు వారి యభివృద్ధికై పాటుపడుచుండెను. దక్కను విద్యాసమా జమున కాతఁ డనేకసంవత్సరములు కార్యదర్శిగ నుండెను. మఱియు 'సుధారక?' అను పత్రిక కతఁడు సహాయసంపాద కుఁడుగ నుండెను.

గోఖలే పూనానగరమున నివసించిన కాలమున మహా దేశ గోవింద రేనడేయను సుప్రసిద్ధ న్యాయమూర్తి మైత్రి సంపాదించెను. పూనాలో సర్వజనకసభ పేరిటఁ గొంత మంది ప్రముఖులొక సమాజమును నెలకొల్పిరి. ఆసమా జములోని సభ్యులు దేశములోనిరాజ్యాంగ వ్యవహారము లందు ప్రభుత్వమువారు చేయఁదగినమార్పులను సూచిం చెడివారు. దొరతనమువారీసభయెడ మిక్కిలి గౌరవము కలిగియుండిరి. ఇట్లుండఁగా నాసభతరఫున నొకకార్య దర్శి కావలసివచ్చెను. రేనడే, గోఖలే యాపదవికిఁ దగిన

వాఁడని యతనినే కార్యదర్శిగ నియమించెను. 1898 వ సం వత్సరమున గోఖలే సర్వజనకసభకు కార్యదర్శిగనుండుట మాని దక్కనుసభయని వేఱొకసభ నేర్పఱచెను.

దక్కనుసభకుఁ బ్రతినిధిగ గోఖలే లండనువెళ్లి హిందూదేశముయొక్క స్థితిగతుల కనుఁగొనుటకు స్థాపించ బడిన వెంబ్లీకమీషను నెదుట భారతదేశరాజకీయపరిస్థితు లను, తత్పరిస్థితుల కానుగుణ్యముగఁ గావింపవలసిన మార్పు లను తెలిపెను. ఆతనివాఙ్మాలములు దొరతనమువారి కత్యధికముగ నుపకరించెను. ఆతని యద్భుతశక్తికి దొర తనమువారు విస్మితులైరి. ఆతనికీర్తిచంద్రికలు భారత దేశమునసేగాక ఐరోపాదేశమునఁగూడ వ్యాపించెను.

గోఖలే హిందూదేశమునకుఁ దిరిగివచ్చినపిదప ప్రభు త్వమువారు ప్లేగు కమీషనులో సభ్యునిగ నియోగించిరి. ప్లేగు అను నంటువ్యాధినివారణవిధానములను కనుగొనుట కా కమీష నేర్పడెను. గోఖలే పెక్కుమంది యువకులను జేరఁదీసి ఆ మహాభయంకరవ్యాధిపీడితులకు వివిధోపచార ములఁ జేయించెను. 1889 వ సంవత్సరమున గోఖలే బొంబాయి శాసనసభలో సభ్యుఁడయ్యెను. (Legislative Council of Bombay) 1901 సంవత్సరమున నతఁడు భారత శాసనసభా సభ్యుఁడయ్యెను (Member of the Imperial Legislative Council). తదనంతర మాతఁడు ఫెర్గూసన్

కళాశాలోపాధ్యాయపదవిని చాలించుకొని తనజీవితమును సంపూర్ణముగ దేశసేవయందే వినియోగించుటకు నిశ్చితుఁడయ్యెను. శాసనసభలో నాతఁ డుపపాదించిన తీర్మానముల నవకాశ మొదవినపుడెల్ల ఆచరణమునఁ బెట్టుచుండిరి. హిందూదేశమున గవర్నరు జనరలుగానున్న కర్జనుప్రభువు గోఖలే యప్రతిమప్రతిభను ప్రశంసించి 1904 వ సంవత్సరమున నతనిని సి. ఐ. ఇ. బిరుదముచే గౌరవించెను.

గోఖలేను 1905 వ సంవత్సరమున హిందూదేశ ప్రజ లాతని నఖిలభారతజాతీయ మహాసభాధ్యక్షునిగ నెన్నుకొనిరి (President to the Indian National Congress). 1908 వ సంవత్సరమున భారతదేశరాజకీయ కార్యదర్శిగనున్న మార్లేప్రభువును, గవర్నరుజనరలుగనున్న మింటోప్రభువును హిందూదేశీయులకుఁ గొంతపరిపాలన స్వాతంత్ర్యము నొసంగఁదలంచి గోఖలే నందుల కుపయుక్తములగు సలహాల నిమ్మనిరి. గోఖలే సలహాలు వారి కమూల్యము లయ్యెను. మార్లే మింటో రిఫారము లను పేరునఁ బరఁగు నామార్పులు హౌస్ఆఫ్లార్డ్సు వలనను, హౌస్ ఆఫ్ కామన్సు వలననుగూడ నామోదింపఁబడెను. ఏతత్ఫలితముగ సెక్రెటరీ ఆఫ్ స్టేటుకౌన్సిలులో నిరువురు హిందువులకును, గవర్నరు జనరలు కౌన్సిలులో నొకహిందువునకును స్థానము లొసంగఁబడెను. సెక్రెటరీ ఆఫ్ స్టేటు కౌన్సిలలో

ప్రథమమున గోఖలేను సభ్యత్వము స్వీకరించవలసినదని ప్రభుత్వమువా రడిగిరి. స్వతంత్రుఁడుగనుండియే దేశమునకు సేవచేయఁగలనని యాతఁడా పదవి నిరాకరించెను.

తదనంతరము గోఖలే ప్రాథమిక నిర్బంధోచిత విద్య యెల్లచోటుల నుండవలయునను శాసనమును సామ్రాజ్య శాసనసభలో నుపపాదించెను గాని ఆశాసనము నాచరణములోఁబెట్టుట కది తగినయదనుగాదని త్రోసివేయఁబడెను. కొంతకాలము గడచినపిదప నాశాసనము మఱల నుపపాదింపబడి, సభ్యులందఱిచేతను నామోదింపఁబడియెను.

దక్షిణాఫ్రికాలో నివసించు భారతీయుల నచటి దొరతనమువారు వివిధముల బాధింపఁసాగిరి. ఆవార్త హైందవుల కత్యధిక దుఃఖకరమయ్యెను. దక్షిణాఫ్రికా భారతీయుల కష్టములను తొలఁగించు నుద్దేశముతో గోఖలే దక్షిణాఫ్రికా కరిగి వారి కష్టములను, దక్షిణాఫ్రికా దొరతనమువారికిఁడ హిందూదేశీయుల యెడందలం దుత్పన్నమైన అనాదరభావములనుగూర్చి ప్రభుత్వమువారితో విశేషముగ ప్రసంగించి వారిబాములను జాలమట్టుకుఁ దొలఁగించెను.

1905 వ సంవత్సరమున మహాదేవగోవింద రేనడే సలహా ననుసరించి గోఖలే భారతదేశ సేవాసంఘము నేర్పఱచెను. ఆసంఘమునకు సెర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసయిటీ యనిపేరు. ఆసంఘములో సుప్రసిద్ధ పురుషులు సభ్యు

లుగాఁజేరి గోఖలేయుద్దేశములననుసరించి యిప్పటికిని దేశసేవ నొనరించుచున్నారు.

1912 వ సంవత్సరమున పబ్లికు సర్వీసు డిపార్టుమెంటులనుగూర్చి యేర్పడిన కమీషనులో నితఁడును, న్యాయమూర్తి అబ్దుల్ రహీమును సభ్యులుగ ప్రభుత్వమువారిచే నియోగింపఁబడిరి. హిందూదేశమున చాలచోట్ల కరిగి సహేతుక వాఙ్మూలముల సేకరించి వారింగ్లాండు కేగిరి. ప్రభుత్వమువారు గోఖలే పరిశ్రమకు సంతసించి కె. టి. బిరుదము నొసంగఁబోవ నతఁడు వలదని నిరాకరించెను. ఆతఁ డింగ్లాండునందుండఁగనే ఆరోగ్యము చెడిపోవ హిందూదేశమునకుఁ దిరిగివచ్చెను. గోఖలే 19-2-1915 న పరలోకమున కేగెను.

# దాదాభాయి నౌరోజి

బ్రిటిషు పరిపాలనమున హిందూదేశవాసుల స్వా తంత్ర్యమునకై పోరాడి, వారినుండి యనేకములగు హక్కులను, అధికారములను, మహోన్నత పదవులను దేశీయుల కిప్పించుటకై జీవిత సర్వస్వము నర్పించిన దేశభక్తులలో దాదాభాయి నౌరోజి యొకఁడు. దేశ పరిపాలనమునందలి కష్ట నష్టములఁ బ్రభుత్వము వారికిఁ దెలిపి దేశముకొఱకుఁ బాడుపడు నుద్దేశములతో నెలకొల్పఁబడిన దేశీయ మహాసభా సంస్థాపన విషయమున విశేషముగ తోడ్పడిన దేశీయులలో దాదాభాయి నౌరోజి ముఖ్యుఁడు. మహాత్ముఁడగు నితఁడు తన జీవితకాలమును భారతదేశ సేవకే వినియోగించెను. అట్టి యీ మహానుభావుని జీవితచరిత్రమవశ్యము పఠనీయము గదా?

1825వ సంవత్సరము సెప్టెంబరు 4వ తేదిని దాదాభాయి నౌరోజి బొంబాయి నగరమున జనన మందెను. బాల్య దశ యందున్నపుడే దాదాభాయి నౌరోజి తండ్రిని గోల్పోయెను. పితృమరణానంతరమాతఁడు యోగ్యురాలైన తల్లి చేతను, ఆమె సహోదరునిచేతను బోషింపఁబడెను.

ప్రాథమికపాఠశాలలో విద్యాభ్యాసము ముగిసినంతనే దాదాభాయి నౌరోజి ఆంగ్ల పాఠశాలలోఁ జదువుకొన

సాగెను. అతఁడు సుందరుఁడు. మేధావి. అతనియందమును, అత్యద్భుతబుద్ధికౌశలమునుగాంచి ఎల్లరు నాశ్చర్యచకితులగు చుండిరి. ఆంగ్ల భాషాభ్యాసమునందు దివ్యానురక్తిఁ గలిగియున్న దాదాభాయి నౌరోజితరగతిలోఁ బ్రథముఁడుగ నుండుటయేగాక ప్రతిసంవత్సరమును విద్యాధికారులనుండి లెక్కలేనన్ని బహుమానముల నందుచుండెను. ఉన్నత పాఠశాలలో ప్రవేశపరీక్షయందుఁ బ్రథమ స్థానమున నుత్తీర్ణుఁడై ఉచిత విద్యార్థి వేతనము (Free-Scholarship) గైకొని ఎల్ఫిన్‌స్టన్ కళాశాలలోఁ జేరెను.

కళాశాలాధికారులుకూడ నతని బుద్ధి వైశద్యమున కచ్చెరువందిరి. కళాశాల ప్రధానాచార్యుఁడగు సర్ ఎర్స్కైన్ పెర్రీ దాదాభాయి నౌరోజీని న్యాయశాస్త్ర మభ్యసించుట కింగ్లాండు పంపనెంచి యందులకగువ్యయములో నర్ధభాగము తాను భరింతుననెను. అతని బంధువు లాతనిని విదేశ యానము వలదని ఆపివైచిరి.

దాదాభాయి నౌరోజి తదనంతర మా కళాశాల యందే సహాయోపాధ్యాయుఁడుగఁ జేరెను. 1850వ సంవత్సరమున నతఁడా కళాశాలయందే గణిత ప్రకృతి శాస్త్రాధ్యాపకుఁడుగ నియోగింపఁబడియెను. 1856 వ సంవత్సరమువఱకు దాదాభాయి నౌరోజి యా కళాశాలలో నధ్యాపకపదవి యందే యుండెను.

దాదాభాయి నౌరోజి బాల్యమునుండియు తన జీవితమును స్వదేశసేవకొఱకు వినియోగపఱచవలయునని సంకల్పించియుండెను. అతఁడు దేశౌన్నత్యమునకుఁ బ్రథమమునఁ దోడ్పడెను. బీదబాలురకు విద్యాభ్యాసమున కవకాశమొదవునట్లుచితముగ విద్యఁగఱపు పాఠశాలలను, బాలికా పాఠశాలలను నతఁడెన్నో స్థాపించెను. ఈ పాఠశాలల నెలకొల్పు విషయమున ననేకమంది పారసీకభాగ్యవంతు లాతనికిఁ దోడ్పడిరి.

ఇదియేగాక దాదాభాయి నౌరోజీ దేశకాల పరిస్థితులను చర్చించుసాంఘికసమాజములఁ గొన్నిఁటిని స్థాపించెను. రస్తుగస్తరు (సత్యవాదిని) అను గుజరాతీవారపత్రిక నతఁడు నడపసాగెను. 1855వ సంవత్సరమున నాతఁడును, మఱి యిరువురు పారసీకభాగ్యవంతులును గలసి ఇంగ్లాండు దేశములో కామా అండ్ కో అను నొక కంపెనీ నెలకొల్పిరి. వర్తకకార్యాలయములు లండను లివర్పులు నగరములందేర్పఱుపఁబడియెను. ఇంగ్లాండు దేశమున వాణిజ్యము చేయుట కారంభించిన హిందువులలోఁ బ్రథములువీరే. దాదాభాయి నౌరోజీ లండను వర్తకకార్యాలయముననుండు టవసరమగుటచే 1856వ సంవత్సరమున నాతఁ డెల్ఫిన్సుస్టను కళాశాలాధ్యాపక పదవినిజాలించుకొని లండను నగరమున కరిగెను.

లండను నగరమందాతఁడు కేవలము ధనార్జన తత్పరుఁడై యుండలేదు. ఆంగ్లేయులు హిందూదేశము నెడ దురభిప్రాయముగలిగి, పరిపాలనవిషయములం దొకింత వైముఖ్యము జెందియుండుట పరికించి దాదాభాయి నౌరోజీ వారు హిందూదేశమునెడ సుముఖతఁ గలిగి వర్తించుచుండున ట్లొనరింపఁ గృత నిశ్చయుఁడై ఈస్టిండియా అసోసియేషను పేరటనొక సమాజము నెలకొల్పి, హిందూదేశీయులను, వారి హక్కులను, వారి యాచారవ్యవహారములను, ఉపన్యాసరూపమున నాంగ్లేయులకుఁ దెలియఁ జేయసాగెను. ఆసమాజములో జమీందారులు, రాజులు, మహారాజులును జాలమంది ఆంగ్లేయులనుగూడ సభ్యులుగఁ జేరిరి.

1873 వ సంవత్సరమున బ్రిటిషుప్రభుత్వమువారు హిందూదేశము యొక్క ఆర్థికపరిస్థితులను విచారించుట కొక కమీషనును నియమించిరి. ఆ కమీషనుసభ్యులు భారత దేశపరిస్థితులును బాగుగ నెఱింగిన దాదాభాయి నౌరోజీని హిందూదేశముయొక్క ఆర్థిక పరిస్థితులను దెలుపుమని యడుగ నాతఁడు హిందూదేశము కడుంగడు నిఱుపేద దేశమనియు, నాదేశవాసుల యాదాయము సంవత్సరమునకు రూప్య 20 లను మించదనియు తెలిపెను.

తదనంతరము దాదాభాయి నౌరోజీ హిందూదేశమునకుఁ దిరిగివచ్చి బరోడా సంస్థానమునకు దివానుగ

నియోజితుఁడయ్యెను. ఆ సంస్థానము ననేకవిధముల నభివృద్ధి నొందు నట్లొనరించెను. కొంతకాలము గడచిన పిదప నతఁడు దివానుపదవిని చాలించి బొంబాయి నగరమున కరిగెను. అచట నతఁడు పురపాలక సంఘ సభ్యుఁ (Municipal Corporation) డుగను, శాసనసభా సభ్యుడుగను నెన్నుకొనఁబడెను. తరువాత నఖిల భారతజాతీయ మహాజనసభ ప్రారంభింపఁబడి, ప్రథమ వత్సరమున బొంబాయిలో జరిగినపుడాతఁడనంత సాహాయ్యమొనరించెను. ద్వితీయ సమావేశము కలకత్తా నగరమున జరిగినపు డాతఁడే యధ్యక్షుఁడుగ నెల్లరచే నెన్నుకొనఁబడెను.

హిందూ దేశముయొక్క హక్కులను దేశీయుల కిప్పించవలెనన్నచోఁ గొందఱు హిందువులకు హౌసు ఆఫ్ కామన్సులో ప్రవేశముండవలయునని తలంచి 1886వ సంవత్సరమున లాల్ మోహనఘోషుతోఁగూడ నింగ్లాండునకుఁ బోయి పార్లమెంటు సభ్యత్వమునకుఁ బ్రయత్నించెను. ప్రథమ పర్యాయమాతఁడు విజయమునందలేదు. అంతమాత్రమున ధైర్యముఁ గోల్పోవక యతఁడు ద్విగుణీకృతోత్సాహముతో మఱలఁ బ్రయత్నించి 1892వ సంవత్సరమున సెంట్రల్ ఫిన్సుబరీ తరఫున సభ్యుఁడుగ నిలిచి, పెక్కుమంది ఆంగ్లేయులకు ప్రోత్సాహమున విజయముఁ గాంచెను.

హిందూదేశముతో సంబంధములేనిచో దాదాభాయి నౌరోజిదేశమున కత్యధికముగఁ బాటుపడుచున్న విషయము గమనించి దేశీయు లాతనిని మఱల లాహోరునందు 1893 వ సంవత్సరమున జరిగిన జాతీయ మహాజన సభాధ్యక్షునిగ నెన్నుకొనిరి. ఈజాతీయ మహాజనసభయందు రెండు కక్షలు బయలుదేఱెను. ఒకతెగవారు స్వాతంత్ర్యాభిలాషతో తమ హద్దులనుమీఱి, ప్రభుత్వమువారికిఁ గ్రోధము జనించునట్లు మెలఁగసాగిరి. ఈ కక్షవారియభిప్రాయములు మార్చి, ప్రభుత్వమువారితో నీ విషయమున నేకాభిప్రాయులై యుండునట్లు చేయుభారమును, శాంతిలేక నిరంతరము తగవు లాడుచుండిన హిందూముసల్మాను సమ్మేళన భారమును దాదాభాయి నౌరోజీపైఁ బడెను.

ఈ రెండింటిని సఫలమొనరించుటకై దాదాభాయి నవురోజీ 1916వ సంవత్సరమున మఱల కలకత్తా జాతీయ మహాజన సభాధ్యక్షుఁడుగ నెన్నుకొనఁబడెను. అప్పటి కాతఁ డెనుబదిరెండుసంవత్సరముల ప్రాయములకలవాఁడయ్యెను. ఆతఁడు తనజీవితమును సంపూర్ణముగ దేశసేవయందే వినియోగించెను. వృద్ధుఁడగుటచే నాతఁడు రాజ్యాంగ వ్యవహారములందు జోక్యముగలుగఁ జేసికొనక వెర్సోవా అను కుగ్రామమున తన శేషజీవితమును గడుపసాగెను. ఆతని కూఁతురును, అల్లుఁడును వివిధముల నాతనికి సపర్యలొనరించు

చుండిరి. దాదాభాయి నౌరోజీ 1917సం॥ రము జూను 30వ తేదిని మరణించెను.

ఆతఁడు దేశమున కొనరించిన సేవ సంస్తవ నీయమైనది. అమూల్యమైనది. కార్యదీక్షయే కార్యసాఫల్యసాధమునకుఁ బ్రథమసోపాన మనియు, ధర్మమే జయ మొసంగుననియు దాదాభాయి తలంచియుండెను. దాదాభాయి నౌరోజీ నిరతిశయానందనిలయమగు స్వర్గలోకమునుండి భారత యువకులను దేశసేవా తత్పరులు కండని దీవించుచున్నాఁడు. హిందూదేశములోని యాదర్శక పురుషులలో నౌరోజీ ముఖ్యుఁడు.

# బాలగంగాధర తిలకు

బాలగంగాధర తిలకు దేశసేవాపరాయణులలో నగ్ర స్థానము వహించినాఁడు. ఆతఁడు స్వార్థత్యాగి. దేశముకొఱకు బాధపడినవారిలో నాతఁడొకఁడు. మాతృభూమికొఱకు తనజీవితమునునర్పించినందువలననే లోకమాన్యుఁడని సుప్రసిద్ధిఁ గాంచెను.

1856 సం॥ రమున బొంబాయి రాజధానిలోనున్న రత్నగిరి యనుగ్రామమున బాలగంగాధరతిలకు జన్మించెను. 1872 వ సంవత్సరమునం దాతఁడు ప్రవేశపరీక్షయందును, 1876 వ సంవత్సరమునఁ బట్టపరీక్షయందును, 1879 వ సంవత్సరమున ఎల్. ఎల్. బి. పరీక్షయందును గృతార్థుఁడయ్యెను.

న్యాయవాది పరీక్షకుఁ జదువుచున్నపుడే యాతఁడు తన జీవితమును దేశసేవకై వినియోగింప నిశ్చితుఁడయ్యెను. కాని యతఁడు రాజకీయ విషయములందు పాల్గొను తలంపాతని హృదయమున నుత్పన్నము కాలేదు. ఆతఁడు విద్యావిషయమున హిందువుల నున్నతస్థితికిఁ గొని రావలయుననెడి యుద్దేశముతో నుండెను. బాలగంగాధర తిలకీ యుద్దేశమును

---

బొంబాయిలో బి. యల్. (లా పరీక్షకు) యల్. యల్. బి అని అందురు.

తనమిత్రులగు ఆపక్షేకును, అగార్కరునకును నెఱింగిం చెను. వారు మహాదేవ గోవింద రేనడేకు తమ యభిప్రాయ మును వెలుప నాతఁడయ్యది అవశ్య మాచరణీయమని తెలి పెను. తదుద్దేశము క్రియారూపము నందఁజేయవలెనని దృఢ ముగ సంకల్పించుకొని శంకర పాండురంగపండిత మహాశయుని తోను, సర్. యన్. జి. చండా వార్కరుతోనుగూడ నాలో చించి, 1882 సం॥ రము జనవరి 2 వ తేదిని పూనానగరమున న్యూ ఇంగ్లీషుస్కూలు (New English School) ను నెల కొల్పిరి. పాఠశాలను నెలకొల్పుటతో తిలకు నుద్దేశము సఫ లము కాలేదు. ఆంగ్లమున 'మహారాష్ట్ర' యను పత్రికను మహారాష్ట్రభాషలో 'కేసరి'యను పత్రికనుకూడ నాతఁడు ప్రచురింప సాగెను.

మహారాష్ట్ర కేసరీ పత్రికా ప్రచురణ మారంభమైన కొలఁది మాసములలో కోల్హాపురము మహారాజును గుఱించిన యొక నిందాపూర్వక వ్యాసప్రచురణమునకై తిలకును, అగార్కరునుగూడ నరెస్టుచేసి నాలుగుమాసములు కారా గారావాసశిక్షవిధించిరి. కారాగృహ విమోచనమైన యనం తర మాతఁడు పాఠశాలో పాధ్యాయుఁడుఁ బనిచేయసాగెను. ఆతఁ డింగ్లీషులో గణితము, శాస్త్రము, సంస్కృతము బాలురకు బోధించుచుండెను. ఇట్లుండఁగా 1884 వ సంవత్సర మున స్థాపింపఁబడిన దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీవారు తాము స్థాపించిన ఫెర్గూసన్ కాలేజిలో న్యూ ఇంగ్లీషు

స్కూలును దమ కాలేజిలోఁ గలుపుమని కోరిరి. అగార్కరు, చందావార్కరు మున్నగువారందఱు నందుల కంగీకరించిరి. తిలకుగూడ సమ్మతించి 1890 వ సంవత్సరమువఱకునందుపాధ్యాయుఁడుగ నుండెను. తదనంతరము ప్రభుత్వమువారు గ్రాంటు నిచ్చెదమని యధికారము చేయఁ బూనుటవలనను, తక్కుంగల యధికారవర్గములోనివారందఱు నందులకు తమయాంగీకారము తెలుపుటవలనను తిలకుహృదయమున విస్మయ విచారములు పెనంగొనెను. ఏతత్ఫలితముగ తిలకు పాఠశాలోపాధ్యాయపదవిని జాలించుకొనెను.

అప్పుడైనను నతఁడు రాజ్యాంగ వ్యవహారములందు పాల్గొనలేదు. ఆతఁడొక కళాశాలను స్థాపించి ప్లీడరు పరీక్ష కనేకమంది విద్యార్థులఁ దయారుచేయసాగెను. 1892 వ సంవత్సరమున లండనులో జరిగిన ఇంటర్నేషనల్ ఓరియంటలిస్టుల కాన్ఫరెన్సు (మహాసభ)లోఁ జదువఁబడుటకు వేదముల పై నొక వ్యాసమును వ్రాసిపంపఁగా మాక్సుముల్లరు, జాకబు మున్నగు సుప్రసిద్ధ సంస్కృతపండితులు తిలకు ననేకవిధముల నభినందించి ప్రశంసించిరి. ఆ మఱుచటి సంవత్సర మావ్యాసము గ్రంథరూపముఁ దాల్చెను.

బాలగంగాధర తిలకు ప్రజల హృదయములందు దేశభక్తిబీజముల నాటుటకొక క్రొత్తతెన్ను నాలోచించెను. ఆతఁడు కాంగ్రెసుపై నభిమానము కలిగియున్నవాఁడైనను,

కాంగ్రెసు ఆశయములు నెఱవేఱుటకు సక్రమవిధానము నెవ్వరు ననుసరింపక పోవుటచేతను, ప్రతిసంవత్సరమును దేశ నాయకులొక్కెడ గలిసికొని, ఏమో కొన్ని తీర్మానములుప పాదించి, మహాసభ ముగిసినపిదప నాతీర్మానములను జిత్తు కాగితములలోఁ గలుపుచుండుటచేతను, నాతఁ డామార్గ మనుసరణీయముగ లేదని తలంచెను. పాటకజనహృదయము లందు దేశభక్తి, దేశారాధన, దేశసేవ, మున్నగువిషయములు బలవత్తరముగ నాటుటకు కులదైవములు దేశమునందు జన్మించి దేశసేవాపరతంత్రులై తమ జీవితమును గడపిన బ్రిటిషు సామ్రాజ్యభానుఁ డస్తమించుననియు, బ్రిటిషు పరి పాలనములేనిదే హిందూదేశ మరాజకమై, విపదంబుధి మునుఁగుననియు, బ్రిటిషుపరిపాలనమున హిందూదేశము నకుఁ గొన్నిముఖ్యలాభములు సంప్రాప్తమయ్యెననియు నతఁడు తలఁచెను. ఏలననఁ బూర్వము శిశుహత్య ప్రబలి యుండెను. ఆంగ్లేయులా దురాచారము నణచివేసిరి. సహ గమన దురాచారమువలన ననేకమంది వితంతువు లనవసర ముగ తమ ప్రాణములను గోల్పోవసాగిరి. ఆదురభ్యాస మునుగూడ బ్రిటిషుప్రభుత్వమువారు సమూలముగ నశింపఁ జేసిరి. పూర్వము దొంగతనములు, దారులుకొట్టుట విశే షముగనుండెను. అదికూడ వారు మాన్పించిరి. ఇట్టివే యనేకములగు మేళ్లనుజేసి వారు హిందువుల కృతజ్ఞతకుఁ బాత్రులైరి.

ఆతఁడు విశేషముగఁ బాటుపడి హిందువులకున్న తోద్యోగములు ప్రభుత్వమువా రొసంగున ట్లొనరించెను. ఆతఁ డీవిషయమున నొనరించినకృషి సఫలమయ్యెను. పూర్వమెక్కఁడనో ఒకరిద్దఱు హిందువులకు హైకోర్టుజడ్జీ పదవి లభించుట యరుదై యుండెను. ఆతఁడు వృద్ధుఁడగు కాలమున నట్టి పదవులు లభించుట సామాన్యమయ్యెను.

వీరులజ్ఞాపకార్థము ఉత్సవములను కాలానుగుణ్యముగఁ జేయుచు, నాయుత్సవసమయములం దుపన్యాసముల నొసంగి వారికి దేశము - దేశసేవ-మాతృపూజ - మున్నగు దేశసేవా సూత్రముల నెఱుకపఱచవలయుననియు, దన్మూలమున అఖిలభారతజాతీయ మహాజనసభాశయములు తప్పక యీడేరుననియుఁ దలంచెను. ఈయుద్దేశముతో నతఁడు గణపతి యుత్సవములనియు, శివాజీ ఉత్సవములనియు రెండిఁటిని ప్రారంభించెను. ఉత్సవసందర్శనమునకు వేలకొలఁదిజను లరుదెంచి, బాలగంగాధరతిల కొసంగు గంభీరోపన్యాసముల నాలకించి, దేశసేవయే జీవిత పరమార్థమను రహస్యమును దెలిసికొని, ఆనందకందళిత వదనాంబురుహులై యిండ్ల కరుగుచుండిరి.

రెండు సంవత్సరములు గడచెను. 1896 వ సం॥రమున శివాజీయుత్సవములు చేయవలసిన సమయ మాసన్నమయ్యెను. ఇంతలో భయంకర క్షామము తటస్థించెను.

దేశమందశాంతి ప్రబలెను. వెనువెంటనే ప్లేగుకూడ నారంభమయ్యెను. తిలకు కలవ్రును, ప్లేగును నివారించుట కనేక విధములఁ బాటుపడఁసాగెను. ప్రజలు మిక్కిలి బాధపడిరి. ప్రభుత్వమువారు ప్లేగును నివారించుటకుఁ బెక్కుప్రయత్నముల నొనరించిరి. రెండుమూఁడుమాసములు గతించిన పిదప క్షామమొకింత యణగెను. ప్లేగుకూడ చాలమట్టుకు తగ్గెను. బాలగంగాధరతిలకు శివాజీయుత్సవ ప్రయత్నముల చేయసాగెను. ఉత్సవములు ప్రారంభింపఁబడెను. ఉపన్యాసము లొసంగఁబడుచుండెను. భూనభోంతరాళములు ప్రతిధ్వనించునట్లు జాతీయగీతములు పాడఁబడుచుండెను. ఉత్సవముల తత్వమును బోధించు నొకవ్యాసము 'కేసరి'లోఁ బ్రచురితమయ్యెను. ఆవ్యాసముయొక్క ప్రధానతత్వము సర్థము చేసికొనఁజాలక యొకఁడు లెప్టినెంటు అయిరిస్టు, రాండు అను ఆంగ్లేయోద్యోగుల నిరువురను జంపివేసెను. అట్లు చేయుటవలన దేశమునకు సేవచేసినట్లగునని యాతఁడు భావించెను. వారినిఁజంపిన యతఁడెచ్చటికో పలాయన మొనరించుటయే నట్టిసిద్ధాంతమున్న వ్యాసమును ప్రచురించినందులకై ప్రభుత్వమువారు బాలగంగాధరతిలకును నిర్బంధించి, న్యాయస్థానమున నాయభియోగమును విమర్శించి పదునెనిమిది మాసములు కఠిన కారాగృహవాసశిక్ష విధించిరి.

ఈవార్త ప్రపంచములోని విద్వాంసుల కత్యధిక దుఃఖ మాపాదించెను. బాలగంగాధర తిలకువంటి మహాను

భావుఁడు - గీర్వాణాంగ్ల మహారాష్ట్రభాషాకోవిదుఁడు-కఠిన కారాగృహవాస శిక్ష ననుభవించుటమూలమున విద్యాప్రపంచమున కపార నష్టము మూడుననితలఁచి మాక్సుముల్లరు, జాకబు, సర్ విలియం హంటరు మున్నగు సుప్రసిద్ధ పండితులు విక్టోరియామహారాజ్ఞి సన్నిధికొక విన్నపమును బంపిరి. ఆమె వారి విజ్ఞాపనమును మన్నించి, బాలగంగాధరతిలకును విడిచివేయవలసినదిగా నాజ్ఞాపించెను.

1898 వ సంవత్సరమున నతఁడు కారాగృహ విముక్తుఁడయ్యెను. ఇంతలో మఱియొక కష్టము సంభవించెను. బాలగంగాధరునిమిత్రుఁడొకఁడు మరణశయ్యపైనుండి, మరణశాసనమున్వ్రాసి మఱి నలుగురిని ఆశాసనము నమలులోనికిఁ దెచ్చి సద్గుణశాలియగు నొకబాలునిఁదెచ్చి తనభార్య వానిని పెంచుకొనునట్లు చేయవలసినదని కోరెను. తిలకందుల కంగీకరించి, ఆమిత్రునియెస్టేటులో, గొంతభాగమమ్మి ఋణములు తీర్చి యొకబాలునిఁ దీసికొనివెళ్లి "అమ్మా! ఈబాలుఁడు సుగుణవంతుఁడు. వీనిని దత్తునిగ నంగీకరించి, సుఖింపు" మనివచించెను. ఆమెవల్లెయనెను. సుముహూర్తము నిశ్చితమయ్యెను. ఇంతలోఁ గొందఱు తిలకుపైఁ గొండెములుచెప్పి యామె కతనిపై దురభిప్రాయము కలిగించిరి. ఆమె వారి మాటలకుఁ జెవియొగ్గి తిలకుచేసిన ప్రయత్నముల నన్నిఁటిని భగ్నమొనరించి యాతనిని నిందింపసాగెను. అతఁడు మరణ

శాసనము సంపూర్ణముగ నమలులోనికిఁ దెచ్చుటకై న్యాయ స్థానమున దొకయభియోగమును దెచ్చెను. అయ్యది 1901 సం॥ రమునఁ బ్రారంభమై 1915 సం॥రమున నాయభి యోగము సమాప్తమయ్యెను. అయితే యిన్ని సంవత్సరము లును తిలకు కేవల మీయభియోగ విచారణమునందే నిమగ్నుఁడై యుండెనని చెప్పరాదు. అతఁడు సారస్వతసేవ నేమర లేదు. 1903 వసంవత్సరమున నతఁడు వేదములకు సంబంధించిన యొకగ్రంథమును (The Arctic Home in the Vedas) వ్రాసిప్రచురించెను. ఆగ్రంథ మమెరికా ఖండమునందలి సుప్రసిద్ధ కవులప్రశంసలకుఁగూడ పాత్ర మయ్యెను.

బాలగంగాధరతిలకు మహారాష్ట్రులకేగాక హిందూ దేశమునకే నాయకుఁడు కాసాగెను. కాంగ్రెసువాదుల ననే కుల నతఁడు చేరఁదీసెను. కాంగ్రెసువాదులు తిలకునాయ కత్వమున విజృంభించిరి. సూరతు కాంగ్రెసువాదుల విజృం భణమునకు ఫలితముగ దొరతనమువారు తిలకుపై దేశద్రోహి యని నేరమారోపించి, న్యాయస్థానమున విచారించి ఆఱు సంవత్సరములు కారాగారావాసశిక్ష విధించిరి. బాలగంగా ధరతిలకు 1908 మొదలు 1914 సం॥రము వఱకును కారా గృహమున నుండెను. అపుడాతఁడు భగవద్గీతను మహారాష్ట్ర భాషలో వ్రాసెను. 'గీతారహస్య' మను పేర నది ప్రక

టితమై, ప్రపంచమును విస్మయసాగరమున ముంచివేసెను. ఆగ్రంథము పెక్కు భాషలలోనికిఁ బరివర్తిత మయ్యెను.

1914 వ సంవత్సరమున బాలగంగాధరతిలకు కారాగృహ విముక్తుఁడై స్వగృహమునకు విచారభరితాంతరంగుఁడై యరిగెను. పాపమాతనిసతీమణి తన భర్తకు సంభవించుచున్నకష్టములవిషయమై డోలాందోళితచిత్తయై మరణించెను. తిలకు విషాదభరితస్వాంతుఁడయ్యెను.

ఇంతలో జర్మనీవారికిని, ఇంగ్లీషువారికిని గొప్ప యుద్ధము జరుగఁబోవుచున్నదనువార్త తిలకుచెవులకు విందొనరించెను. ఆతఁడు మఱల రాజకీయ ప్రపంచమున నడుగిడెను. ఆతని మిత్రునిభార్య తెచ్చిన యభియోగము 1915 సం॥రములో ప్రీవికౌన్సిలులో విచారింపఁబడి తిలకుకను కూలముగ తీర్పుచెప్పఁబడియెను.

తిలకు మఱల ననేకమంది యువకులను జేరదీసి స్వరాజ్యముకొఱకుఁ బ్రయత్నింపసాగెను. 1918 న సంవత్సరమున బొంబాయిలో జరిగిన అఖిలభారతజాతీయమహాజనసభలో కాంగ్రెసు ఆశయములను బ్రభుత్వమువారి కెఱిఁగించుట కింగ్లాండునకెవరైన పోవలయునని తీర్మానింపఁబడెను. బాలగంగాధరతిలకే యందులకుఁ దగినవాఁడని వారందఱును దలంచిరి. తిలకు యింగ్లాండునకుఁ బోవుటకుఁ బూర్వము హిందూదేశమునందలి ముఖ్యపట్టణము లన్నిఁటిని

సందర్శించెను. ఆతని ప్రయాణమునకు కొన్ని వేలరూప్యములు వసూలయ్యెను. ప్రతిపట్టణమునందును తిలకునకు రాజసన్మానము జరిగెను. ఆతఁడు కొలంబో వెళ్లఁగా బ్రిటిషు ప్రభుత్వమువా రతని నోడనెక్కవలదని యాజ్ఞాపించిరి. ఈవిషయము దేశీయులకుఁ దెలిసినంతనే దేశములో మహా కల్లోలము సంభవించెను. ఇది గమనించి ప్రభుత్వము వారు దేశీయులకు తమపై ననాదరభావ ముదయించునని ఆతని నింగ్లాండునకుఁ బోనిచ్చిరి.

బాలగంగాధరతిలకుపై నపోహ కలిగియున్న ఆంగ్లేయు లాతనినిఁ జూడగనే, ఆతని యభిప్రాయములఁ దెలిసికొనఁగనే తమ యభిప్రాయమును మార్చుకొనవలసినవారైరి. ఆతని యుద్దేశములను, ఆశయములనుగూడ వారామోదించిరి. బాలగంగాధరతిలకు హిందూదేశమునకుఁ దిరిగి వచ్చుసరికి నూతన సంచలన మారంభమయ్యెను. అత్యావేశముగల స్వరాజ్యవాదులు సత్యాగ్రహ దీక్షఁబూనిరి. గాంధి దౌర్జన్యరహిత సహాయనిరాకరణోద్యమమును ప్రారంభించెను. తిలకు విస్మితుఁడయ్యెను. ఆతనికేమి చేయుటకును దోఁచలేదు. ఇట్టిస్థితిలో నాతఁడు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. క్రమముగా నావ్యాధి దారుణపరిణామమునందెను. బాలగంగాధరతిలకు 1-8-1920 సం॥రమున పరమపద మందెను.

బాలగంగాధరతిలకుయొక్క మహదాశయముల ననుసరించుటవలననే, గాంధి మహాత్ముఁడయ్యెను. దేశము కొఱకు కారాగారమున విశేషముగ బాధపడినవారిలో తిలకు ముఖ్యుఁడు. ఆతని పవిత్రజీవిత మెల్లరకు నాదర్శప్రాయమైనది.

సంపూర్ణము.

Printed at the T. V. C. Press, Madras. 16-12-30'